# ధర్మజ్యోతి



తుమ్మల సీతారామమూర్తిచౌదరి

# అంకితము

సడలనికీర్తిపైఁ బ్రభుత సల్పుతలంపున మామకీన నె
న్వఁడు నలచేఁ గృతిఁ మధురవర్తనుఁ డాతఁడు నెల్లపూఁడివం
గడమున మేలుబంతి చిరకాలపునెచ్చెలికాఁడు దానయా
ఖ్యుఁడు పాలివోనిసంపదలకున్ గుదురయ్యెడు మిందునందునన్

క. ఆకమ్మకులపయోనిధి
రాకాచంద్రముఁడు కావ్యరమణీయత్వ
శ్రీకిన్ లోపడి నాకడ
కీకమ్మను బంపెఁ బద్యహృద్యత వెలయన్

* * *

క. "శ్రీమత్తుమ్మలసీతా
రామకవీ ! సుకవిలోకరంజన ! సుగుణ
స్తోమాభిరామ ! నీకవి
తామహిమము నుగ్గడింపఁదరమే నాకున్

ఆ. కట్టమంచిరెడ్డికనుసన్నఁ గూడిన
*సింహపురసుధీప్రసిద్ధసభను
దిక్కనార్యసత్కృతిం గంటి "నభినవ
తిక్కనాఖ్య నన్నెకెక్కఁజేసి

---

* నెల్లూరు

క. నీతికి నెలవులు కవితా
 రీతులకున్ గనులు నీదుకృతు లందుఁ గడున్
 నూతనమై తగు "ధర్మ
 జ్యోతి" మదంకితముగాఁగ నొనరింపఁగదే

క. హితుముచ్చట మన్నించుట
 మతిమన్మతమౌటఁజేసి మత్ప్రార్థన మం
 చితముగఁ దీర్పుము పేదలు
 కృతజ్ఞతయకాక యేమియిత్తురు కాస్కల్"

* * *

నామేల్గీడులపాలు పంచుకొని నానారీతులన్ మామక
శ్రీమత్తత్స్థలపోయుమిత్ర మిటు లుంచెన్ చాల మన్మత్కృతిన్
లేమిన్ బ్రుంగుటఁజేసి కానుకల నీలే నంచువెన్నాడు నీ
ధీమద్గ్రామణిదాతృతానిరతి కందింతు న్నమోవాకముల్

కోరకమున్న యీహితుసకున్ గృతినిచ్చెడిభాగ్యరేఖ చే
కూరమిఁజేసి లజ్జయును గొందలము న్దలసూపి డెందమున్
గాఁతియపెట్టెడిన్ సుజనగణ్యుఁడు దానయకున్ క్షమాంజలిన్
జేరిచి యిచ్చెదన్ బ్రణయచిహ్నముగా నిపుడేని మత్కృతిన్

క. కృత మెఱుక చాలు నన్మ
 న్మతి కింపద కబ్బ మిచ్చి మణి గొంట; జగ
 ద్ధితశీలుం డొదవ నయా
 చితముగ నే నిడుదు నా సృజించినకవితన్

అగుటనె యిచ్చినాఁడ నఖిలాంధ్రసదస్సుల నిస్సమాన కీ
ర్తిగనిన రాష్ట్రిగానసుకృతిః జలపల్లిన రేంద్రమాళి ; కా
పగిదిఁ దలంచి జంకు నెడఁబాసి మదీయము కావ్యమంది వీ
న్మిగులుత దానయాఖ్యుఁడు సమిద్ధయశస్తరుణీద్వితీయుఁడై

నపునకుఁ గబ్బమిచ్చుట యనాదృతకృత్య మటంచు సత్కవీ
శ్వరులు పురాతనుల్ నొడువుచంద మదే మొ రుచింప దింతయుః
సిరులకు నాసఁజెంది యొకచెన్నఁటి కిచ్చుట మచ్చగాని స్వా
ర్థరహితబుద్ధి నిద్ధగుణరాశి కొసంగిన దోస మున్న దే

క. కావున నేతత్కావ్యము
పావనచరితునకు మృదులభాషాకవితా
శేవధికి మధుమథనపద
సేవానిరవధికి బంధుచింతామణికిః

క. రంగమహ్మదంబుజగ్రహ
పుంగవ రామాభిధానపున్నిరయార్చి
రంగ్రప్రాప్యడ్డలదున
కంగీకృత నైకసుకవిహారి హార్దునకుః

క. శ్రీవిజయవాటికా మహి
ళా వాత్సల్యాంచ "దెసమలకుదురు" సద్గ్రా
మావాసవిభాసికి గురు
తావాసజ్జీవితునకు దానార్యునకుః

# ధర్మజ్యోతి

క. అలనాఁడు వాసికెక్కిన
పల*నాఁ డది తనకుఁ గూర్చుబంధువు గాఁగన్
గలనాఁడులలో మిక్కిలి
వెలనాఁడై తెలుఁగువారి వెలనాఁ డలరున్

శాలిశతాబ్ది భూమిశశిసంఖ్యల నందిన వేళఁ జోళభూ
పాలు రుదారులై కదనపండితు లూర్జితభోగభాగులై
యేలిరిదాని "గొంక" ధరణీశ్వరముఖ్యులు మేలుమే లనం
జాలిరి పాలితాళి నిజశాసనముల్ శిరసావహింపఁగన్

అంచితు లంధ్రచోళవిభు లర్థి నొసంగిన యగ్రహారముల్
పెంచినయట్టి ◆తోఁపులును బేర్చినభక్తిఁ గళానురక్తిఁ గ
ట్టించిన దేవళంబులు ఘటించినకూపములు న్దటాకముల్
మంచినసత్రముల్ నిరుపమానములై విలసిల్లె నెల్లెడన్

గీ. తన్నరేంద్రాలి సర్వజ్ఞతయును శంక
రత్వ మీశత్వ మార్యానురక్తతయును
గామజిత్త్వంబు రాజశేఖరత నేర్చి
తనరె నిజశైవధర్మసార్థకతఁ గూర్చి

---

* శాసనములం బట్టి దేశవాచి "నాఁడు" నం దరసున్న వలసె.

◆ ధర్మవనములు.

క. నడిసన్నవారికత్తికి
గడిదొరలు వడంకి మత్తగజమండలిపై
నిడి పంపెడికప్పము ల
ప్పుడమికి వ్రేగయ్యె రత్నభూరిమయంబుల్

ఎత్తిరి కోట్లకుం బడగ లెల్లవణిక్కులు రాజదత్తముల్
విత్తములంది పేర్వడిరి విప్రులు వైదికధర్మకర్మఠుల్
విత్తినవిత్తనంబు పదివేలమడుంగులు పండఁ గాఁపువా
రొత్తిరి శంఖముల్ సిరుల నుబ్బిరి * కార్మికు లప్పు డమ్మహిన్

గీ. హోమధూమమ్ము నిండి గోత్రామరాళి
గీములన్నియు నీలతాధామములు గ
సార్థకంబయ్యె నవ్వేళ నగ్రహార
మునకు నల్లి ల్లనంగను జనెడిపేరు

ఆ. "•మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గాని పైఁడితొడవు" గానమపో! వెల
నాఁటిదొరల రాచవీటిలోన

క. అగ్గింపనేర్తు రెవ్వరు
కగ్గనికస్తూరితోడి కలయంపులపై
మ్రుగ్గులు ముక్తామయములు
నిగ్గుంజగ్గుల వెలార్ప నెగడిన దానిన్

---

* కూలివాండ్రు:—కార్మశబ్దముపై స్వార్థమున 'కన్'
• " " ఈ గుర్తులలోనిది మంచన్నది.

సీ. చీనాదుకూల సంతానమ్మునకు బ్రహ్మ
భూమిహిమాంబు సంపూరమునకుఁ
గాశ్మీరహిమవాలుకా కుంకుమములకుఁ
బాంచాల మృగమద భాండములకు
గోవాప్రశస్త సంకుమదమ్మునకుఁ గొచ్చి
జాజికాయకు గంధసారమునకు
సింహళద్వీప హస్తిఘటా ప్రశస్తికి
హురుమంజి ఘోటకోత్కరమునకును

గీ. మేటి జలనోగి బంగారు పేటికలకుఁ
బందువా నవరత్న సంభారమునకు
శరణమై నాఁటి సాటి దేశాలపంక్తు
పులియఁబాఱంగఁజేసె నప్పురవరంబు

క. ఆ వీడే ధనదపురం
బా వీడే ధనదవోలు నదియ సనదవో
లీవేళఁ జందవోల్గా
బోవం బోవంగ నదియపో ! చందోల్గా

సీ. మంచన్న కవిశిరోమణి కావ్యకన్యకుఁ
బారాణి పూసె నే భాగ్యరాశి
గడుసుజోదుల విచ్చుఁగత్తి తళ్తళలలోఁ
దిలకంబుదిద్దె నే కలికిమిన్న

నరపాలకన్యకా సరస వీణాగాన
సుఖములో నే కాంత సుప్తినడసె
వందిమాగధుల కైవారంపు రవళిలో
వదలె నే యిల్లాలు నిదురసొక్కు
గీ. చోడరాణ్మండలీ యశస్సుమము విసరు
కసరుఁదావికి నే కొమ్మ కొసరి పొంగ
నా పురీలక్ష్మి ధనదవో లక్కటా! ని
రస్తవైభవయై నేఁడు కస్తిగూర్చు

చ. చెదరినశాసనంబులును జెల్వమువాసిన దేవళంబులున్
జదునయినట్టి కోటలును జాడలు దప్పిన పేఁటలున్ భయా
స్పదములు దిబ్బలై మిగులఁ బాడఱిపోయిన మేడమిద్దెలై
యెదనలయించుఁ దెల్గులకు నిప్పుడు తత్పుర మొక్కపల్లెయై

ఆ. బ్రదికిచెడ్డ తెల్గు పడుచులు నేఁడు త
జ్జనపదంబు నీఁగి చనెడువేళ
నొక మహోజ్జ్వలాశయోర్మి విజృంభించి
కంటికొనలఁ జూపుఁ గనకయుగము

## ౨

సీ. ఆంగిలేయులు నేఁటి కఱువదియేండ్ల నాఁ
డింద్రకీలమునొద్ద నిద్ధవారి
సంపన్నమై జగజ్జన కల్మషాపహ
మై గభీరప్రవాహాభిరామ
మై సహ్యజాతమై భాసిల్లు కృష్ణకు
నానకట్టనుగట్టి వేనవేల
కుల్యాల నిరుగెలంకుల నమర్చెడి వేళ
నొదవె నిప్పూరి పశ్చిమోర్వి నొక్క-
ఆ. కాల్వ; దానిఁ ద్రవ్వ కార్మికులందొక
మేఁటి యొడ్డెవాఁడు నాటినట్టి
గడ్డపలుగు ఖంగు ఖంగున మ్రోసి కే
లెడసి నేలమీఁద మిడిసిపడియె

క. అబ్బో! యిది యేమిర! చిన
సుబ్బా! యనునంతలోనె చుట్టుకొనిరి యా
గుబ్బుగఁ బనివాండ్రతనిని
దబ్బిబ్బై మానసములు దందడి వెట్టన్

క. అటునిటుఁజూచిరి గుండెలు
తటతట మనుచుండ నేలఁ ద్రవ్విరి మేఁలా
నిటుకలతో సున్నముతో
ఘటియించిన లిబ్బినచటఁ గాంచిరి పేదల్

క. అల్లన కదల్చి పైమఱు
వెల్ల సపసరిల్లఁ జేసి హృదయంబులు జల్
జల్లనఁ బసుపుందళుకులు
చల్లెడి తల్లులను గనిరి స్వర్ణేష్టకలన్.

గీ. సప్తసంతాన రతుఁడై ప్రశస్తి గన్న
పురుషుఁ డెవ్వాఁడు వసుధలోఁ బూడ్చె నిట్టి
పసిఁడియచ్చులు; వాని కాబ్రహ్మకల్ప
మగ్గపడుఁగాక నాకసౌఖ్యానుభూతి

క. రెండా మూఁడా కాంచన
ఖండము లొడ్డెలకు నూఱు కన్పట్టెను; దే
తెండని బలియిచ్చిరి నడ
గొండల నవ్వారు పందిగున్నల నిధికిన్

క. భాగించుకొనిరి తమతమ
భాగమ్ముల కొలఁది వెలఁది బంగరు టచ్చుల్
భోగమ్ముల వెల్లువలో
నీఁగితి మని విరిసి మురిసి రింటికిఁ జనుచున్

క. రొక్కమ్మున కా బంగరు
ముక్కల నమ్మంగఁ దలఁచి ముదుసలి యొడ్డెల్
చిక్కని చీఁకటి ముసుఁగునఁ
గిక్కురుమన కూరిలోనికిం జనిరంతన్

క. పరిచితులగు పేరుల ని
ద్దరకు న్దొలఁగించి పైఁడితున్కలఁ జూపిం
చిరి వానికల్మి నెఱిఁగిం
చిరి సరివిత్తమ్ము నభిలషించిరి పేదల్

క. అచ్చులు పొడగన్నంతనె
బచ్చులు పేరాస కగ్గపడి కల్లలకుఁ
జొచ్చిరిసీ ! యివి యిత్తడి
యచ్చులు పొమ్మనిరి విఱిచి రార్చిరి పేదవుల్

ఆ. కాసుదూడ కై దుకాసుల బంధమై
కొంపమునుఁగు ఏనిగుట్టు పొక్క
నెఱిఁగి యెఱిఁగి మెడకు నురిఁ దెచ్చుకొందు మా
పొదఁ డదేల లేనిపోని బెడఁద

క. తొనఁకని గంభీరతమై
వణికుక లిట్లాడ నోడ్డవాంద్ర మొగమ్ముల్
జుణిఁగె నొడల్లు సెమర్చెను
మనోరథము లెల్ల నొక్కమాటే ప్రిదిలెన్

మంజరి. బంగారమని మిట్టిపడితి మిందనుక
నిత్తడి యంద్రు ఏ విది యెంత నిజము
కాదంచు దేశానఁ గల వారి కెల్లఁ
జూపుట మే లౌనె సొత్తు నిద్దానిఁ;
గప్పించి కూర్చిన కనకమా యిదియు

నెంత లాభించిన నేమి నష్టంబు;
ఆలితో బిడ్డతో నాలుగాలంబు
మట్టితట్టలు మోసి మనుఁ డంచు బ్రహ్మ
మన మొగమ్మున మూఁడుమార్లు లిఖించెఁ;
బొరపాటుచే నొకప్పుడు వచ్చెఁగాక
నిఱుపేదకొంపలో నిలుచునా లక్ష్మి?
వెఱ్ఱుల చందాన వెనుకాడనేల?
వచ్చినదే వేయి వరహా లటంచుఁ
దెగనమ్మదము వీని దిగు లేల మనకు;
ననియెంచి వారు బేహారులం జూచి
యయ్యలారా ! వస్తు వరసి మీ యిచ్చ
వచ్చినవెల యింక వాదంబు లేల
ధర్మమే జయముగదా మీకు మాకు?
ననవుడు వర్తకు లల్లన నవ్వి
యేగాని వారలమే కదా మేము
కష్టజీవులు మీరు కడుపేదవారు
పాడిఁదొలంగి పాపపుబండి నెక్కి
మీసొమ్ము తిందుమా మీకేల శంక ?
యిత్తడిసుద్దలే యియ్యవి నమ్ముఁ
డని మూఁడుపీసెల మైదుపలాల
తూఁకమ్ముగల పైఁడితునకకు రెండు
రూప్యముల్ చొప్పున గొక్కమ్ము గట్టి
వెడలించి రొడ్డెల వేగకమున్న

ఆ. కలదె యిట్టి ఘోరకలి - పేదవాఁడెంత
యనదయైన వెంగళప్పయైనఁ
దగునె సాహు లిట్లు తడిగుడ్డతో వాని
గొంతుఁగోఁత వేసుకొన్నరోఁత

వ. అయ్యది యట్లుండె

క. అబ్బిన సిరిఁగని కోమఁటు
లుబ్బక నిబ్బరము నూఁదియున్నను దుద కా
లిబ్బికథ వాడవాడలఁ
బ్రబ్బెన్ గోడలకుఁ జెవులు పైకొనివచ్చెన్

క. పొరుగింటి ప్రొయ్యి రాఁజిన
సరగన్ దమ నిప్పు లాప్పు సాధువు లెవరో
దొరతనమువారి చెవి నూఁ
దిరి బంగరువార్త కడుపుతీండ్రలు వాయన్

ఱెక్కలు కట్టుకొన్నటులు జివ్వున దూఁకిరి చందవోలు నల్
దిక్కులు ముట్టడించి రదలించిరి బేసల; వారిబాసలో
నిక్కము లేదు లేదని వణిక్కుల పెట్టెలువ్రిచ్చి లోఁగిళుల్
క్రక్కదలింపఁజాగి రధికారులు పౌసులు సంభ్రమింపఁగన్

క. మూఁడచ్చులకు న్నోఁచిన
వాఁడొక బేహారి పేదవాఁ డిది గని కా
లాడక చేయాడక వడఁ
కాడుతఱిన్ మిత్రుఁడొక్కఁ డతనిం గదిసెన్

క. వచ్చిన చెలికానింగని
చచ్చిన ధైర్యమ్ము కొంత సమకుఱ నతనిన్
బచ్చుకవుఁగింట నిడి వా
క్రుచ్చెన్ మెలమెల్లఁ దనకుఁ గూరిన చెట్టన్

క. ఈ బెడఁదన్ దలఁగింపుము
నా బిడ్డల కింత జీవనము సూపుము నా
లేబరపుం బ్రదుకెఱుఁగవె
బాబూ! నీ కాళ్ళు పట్టి ప్రార్థింతు ననెన్

గీ. ఏమి సెప్పుదు నక్కటా! యీనఁగాచి
నక్కలకుఁ బెట్టినట్లయ్యె నా ప్రయత్న
మన్న! దేవునివలె వచ్చి తభయమిచ్చి
చెలిమివాటించి నన్ను రక్షింపు మనియె

క. ఆతని దైన్యముగని తన
చేతనయిన మేలు సల్పి సెట్టిని దురవ
స్థాతీర్ణుఁజేయ నేయది
రీతో తెరువని మిత్రుఁ డరయుచుండెడి వేళన్

సీ. సెట్టి నెచ్చెలికాని చెవిలోన నెద్దియో
గొణఁగ మేల్ మే లనుకొని వయస్యుఁ
డద్దిరా! సరిసరే! పద్దన్న నీకేమి
బుద్ధిలేదా? కడుపునకుఁ దిన్న

నాఁడే మఱచిపోయినాఁడవా మా సామ్ము
నెంతకాలం బాయె నిచ్చి; యెన్ని
మార్లడిగిన రిత్తమాటలే చెప్పెద
వౌరా! మొదలు చెడ్డ బేర మెట్లు
గీ. సేయుమందువు; మా ఋణం బీయకున్న
నేఁడు నీపరువది దక్కనేర; దీతఁ
డిట్టులే పేరిలి తనదారిఁ బట్టునని త
లంపకుము; రట్టుపఱుతు సైరింప నిన్ను

అనవుడు సెట్టి యింతటి దురాగ్రహ మేటికి సామి! లచ్చలి
చ్చినటులు మాటలాడెద విసీ! యిపు డింటను జిల్లిగవ్వయుఁ
గనఁబడదయ్యె నీ ఋణమిఁకన్ నిలుపన్ మన సొగ్గదయ్యె నీ
ధనమున కిచ్చువాఁడ సరిధాన్య; మిదే కొనుమంచుఁ బల్కినన్

క. ఆయుత్తమర్ణుఁ డందుల
కీయకొనన్ గొలుచుఁ గొలుచు నెడ గోతములో
మాయముగఁ జొనిపె వర్తకుఁ
డాయచ్చులనెల్ల నుల్ల మల్లలనాడన్

క. వాఁకిటఁగల రక్షకభటు
లీ కీలక మెఱుఁగలేక యిదియేదో బా
కీ కీచులాట యనుకొని
రా కోమటిహితుఁడు వారి నంటుచుఁబోయెన్

క. ధనదునిపీటికి గవ్యా
తిని వేలుపుమన్నె కాని దేసఁగల "కావ్యా"
రను తనపల్లెకు బిరబిరఁ
జను నాతనిమదికిఁ బెక్కు శంకలు తోఁచెఁ

ఆ. నాగుఁబామువోలె నాయింటిలో నిలు
వంగఁజనునె యిట్టి దొంగసొత్తు
తానొకండు తలఁప దైవమ్ము వేఱొండు
తలఁచునండ్రు ధర్మతత్త్వవిదులు.

సీ. సొమ్మువోయియు శని చుట్టుకొన్న విధాన
నెదుఱొమ్ముకుంపపై యిది యలంచు
నేమొ ? కీడెంచి మేలెంచుమన్నా; రని
దారిలోఁ జీమలు దూరరాని
ప్రేఁపపొదల్ జూసి పెద్దచీఁకటి చూచి
నమ్మకం బూఁచి దైవమ్ము మీఁద
భారమ్ము వైచి జొంపములోన మడిసంది
లోతుగుంటను ద్రవ్వి గోతమూడ్చి
పసిఁడి యచ్చుల నద్దానఁ బాఁతిపెట్టి
యంగమచ్చమ్ము లుంచి గేహమ్ము సేరి
గుట్టుచప్పుడు గాకుండునట్టు లప్పు
డప్పతఁడు వచ్చి కనుచుండె నా ధనంబు ౪౪

# 3

ఆ. సద్దుమణఁగిపోయె సంవత్సరము లొండు
రెండు గడవఁ గనకఖండవార్త;
గుండె కుదుటఁబడియెఁ గోమటి కింతలో
మెండుకొనియె మేలిమేలికలలు ౪౬

ఆ. జడల దయ్యమనఁగ జగమెల్లఁ గాఱుఁ జీఁ
కటి వయాళిసేయు కాలమందుఁ
గదలె ముదుకబేరి కాఁదారిమాఁదారి
పొద్దుసూచి నిద్రపొత్తుఁ బాసి

క. పడు పడుక కేనిఁ జెప్పక
యడుగులు మెలమెల్ల నిడుచు నాకసియాడన్
వడఁకుచు నాసయె తోడై
నడవ నతం డితవు గీమునకుఁ బయనించెన్

గీ. ఇనుపగజ్జెల దొరసాని కింపునింపు
కొంపలోఁ దూఁగుసం దోఁగి గుజ్జువెట్టు
కూర్మిచెలికాని మెల్ల మేల్కొలిపి కుశల
మడిగి నయగారములతోడ నొడలు నిమిరి

క. ఈమెడ నరుదెంచితి వే
లా యని మిత్రమ్ముచేత ననుయుక్తుండై
నీ యెఱుఁగని దేమున్నది
నాయన్నా! యనుచు నాలినాలిగ నవ్వెఁ

వ. అంత నచ్చెలిమికాఁడు బేహారియింగిత మ్మెఱింగి

క. నీ బంగరు నర్థింతువె
యే బెడఁదయు రాని తరుణ మేతెంచినదే
నా బరువు న్దొలఁగించెద
వే ళిబబళి రమ్మర మ్మిఁ కేలాతడయ్యెఁ

వ. అని మెచ్చి యచ్చెలున్న పట్టునకు సెట్టితోడం బయనింపఁ దొడఁగె నయ్యవసరంబున

గీ. బరువు తీఱునటన్న సంబరము హెచ్చి
కలవుతీఱు నటన్న ముద్దరిమ మొదవి
యిరవుకొనియున్న గాటంపుటిరులు వారి
కిరువురకుఁ బండువెన్నెలై తెరువుసూపె

ఆ. ఎదురుదెబ్బలెన్ని పదు లంటఁగగిలెనో
దొడ్డపాము లెన్ని యడ్డుపడెనో
తప్పుదారు లెన్ని తంటాలుపెట్టెనో
నిక్కమరసి యెవఁడు లెక్కచేసె

వ. ఇట్లు వారిరువురు గమ్యస్థానమ్ము దరిసినంత నమ్మిత్రుండు

క. రామప్రభూ! కిరాటుఁడు
నామీఁదంబోలె నిల్పినాఁడఁగదయ్యా!
నీమీఁద భారమంతయు
నేమంబా పసిఁడి; కేమిసేయుదు నన్నుౕ

క. అని నుడివఁచుచుం బాదరుం
జని పాఁతునుగ్రొచ్చి మెలిజగ్గులకిరవౌ
కనకపుటచ్చుల నారం
గని మత్సుకృతంబు పండెఁగద యని పొంగెన్

వ. అంత నా సువర్ణంబు వణిజుని కరపుటమ్మునం దునిచి

ఆ. నింద లేవిలేక నీ సొమ్ము నీ చేత
నిడుముహూర్త మెప్పు డెప్పు డంచుఁ
గలవరించునన్నుఁ గరుణించె నేఁటి కా
రంగశాయి మదిక్రొసంగె హాయి

గీ. జాగరూకతఁగల్గు మిజ్ఞాతరూప
మొదవఁ జూడుము లోకాన మొదవుమోర
పులులు చెరలాడుఁ దేనియ పూసినట్టి
కత్తులుండును గిల్బిషగ్రామఖనులు

వ. అనుటయు నతని భావపావిత్ర్యంబునకు వణిజుండు పెద్దయు విస్మయంపడి వానిం బిగ్గఁ గవుంగిలించుకొని యంకురిత రోమ హర్షణుండై

ఆ. ఎంతవాఁడ వన్న! యే యోగమో నీదు
చెలిమికలిమి కర్మ్యఁజేసె నన్ను
నింతవాఁడనైతి నేఁబుట్టి నీయట్టి
నీతినిధిని జూడనేరనగుదు

ఆ. ధర్మములు పరిశ్కృతంబుగ బోధింప
జగతి నెల్లవాఁడు చదురుగలఁడు
నీమ కొక్కఁడేని జెప్పినటుల్ సేయు
నరుఁడు లేఁడు నిన్ను దొరయువాఁడు

సీ. కన్నెత్తి పరసతి గనుటొప్పదని యొకం
డారటంపడును బాజాఅమునకు
సత్యం బఖిలధర్మజనకంబ యని యొక్క
రుఁడు గడ్డిగఱచు దమ్మిడికి లోఁగి
యతిథిసేవమె రమాపతికొ ల్వకాఁ బల్కి
యొక్కొంఁడు తల్లికి డొక్కమాడ్చు,
వర్ణభేదములు చావలయు నంచని యొక్డు
శాఖాభిమానదాస్యంబు నెఱపుఁ

గీ. గుస్మృతి మూర్తులు ధూర్తులుశ్శోకచరతులు
ధర్మవిధ్వంసకారు లేతాదృశులకుఁ
దావలంబైన కలి కెట్లు దక్కితయ్య!
నెయ్యరీ! నీవు వేయేండ్లు నెగడవయ్య!

క. పరధనవై ముఖ్యము ని
కృరణిం బ్రకటింతువే! జగమ్మున నిన్నున్
దొరసెడి పుణ్యులు గలరే
నరుండవే నీవు వేల్పువా? జాలవొకో

శ్రుతులును బ్రహ్మవేత్తలును సూనృతవాదులు గోవులున్ బతి
వ్రతలు నలుబ్ధులై నెగడువార లుదారవదాన్యతాకళా
రతులునకాక యిమ్మహిభరమ్మున కెవ్వరు చాలువారు ప
ర్వతములునేస్గులున్ ఫణియుఁబందియు మోయుటనమ్మనయ్యెదన్

క. ఈ పసిఁడినెల్లఁ గొనఁగా
నో పుణ్యనిధీ! మదీయ ముల్లము వెఱచున్
నాపల్కుఁ గుఱుచ సేయక
యేపారిన పేర్మి నందు మిందొక ముక్కన్

వ. అనవుడు నమ్మిత్రుండు దానికిం గటకటంబడి

క. తగునే యివ్విధి నన్నుం
బొగడ్త సేయంగ వైశ్యపుంగవ! మిత్రుం
డగువాని ధర్మువునకున్
మిగిలిన ఘనకార్యమేమి నెఱపితిఁ జెపుమా!

శిబివలె మేనికండలను జీల్చితి నెట్లు? మహన్నదీకుమా
రుబలె నఖండరాజ్యరమ రోసితి నొక్కొ? దధీచిమౌని య
ట్లు బెదరులేక వెన్నెముక లాగితి నోటు? త్రిశంకుసూతిభం
గిఁ బలుకరాని కష్టములఁ గీడ్పడి సుక్కితినేమి? సెప్పుమా.

క. నీ సొమ్ము నీ కొసంగితి
వీస మ్మిడ లేద నాదువి త్తము; దీనన్
నా సౌజన్యము కలదా
యీ సేఁతకుఁ బసదనంబు లీయవలయునా?

క. మిత్రుం డిహపరమంగళ
దాత్రగ్రణి యనుచు నధిగతశ్రుతమర్మల్
సూత్రించి రద్భుతజనుః
పాత్రం బిఁక నేమి కానఁబడు మచ్చరితన్

క. వలదు బహూకృతి లేశము
వలాదు నన్ మెచ్చుకోలు వలవని సేఁతల్
వలవదు సువర్ణమిది నీ
యిలు సేరిచికొమ్ము నా కివే నీయచ్చుల్

వ. అనిపల్కి వేగురుంజుక్క పొడుపునకు మున్న సహిరణ్యు నప్పణ్యాజీవునిం జందవోలు సేర్చి యతనికిం గొండొక హితమ్ము గఱపువాఁడై యిట్లనియె

* * *

క. ఇది పేదలసొమ్ము సుమా
యెడ నుబ్బకు మస్మదీయమే యని, దీనిన్
బదిలించి వెచ్చపెట్టం
గదవే విదిలించి లోకకల్యాణమునన్

గీ. అనుభవించుట యన నీఁగి యనఁగఁ జెడుట
నా నవస్థలు మూఁడు స్వర్ణమున కమరుఁ
గుణుపు నొల్లని దానరక్తుండుగాని
యధముసంపద కబ్బు మూఁడగు నవస్థ

గీ. త్రావనొల్లవు వాహిను ల్తమజలంబు
కొఱుకుటకు నిచ్చవడవు వ్రూఁకులు ఫలంబు
మేఁత కొప్పదు సస్యము మ్మేఘపటలి
పరులకే దక్కు సుజనసంపదలు సెట్టి!

క. ఇచ్చునెడ మెచ్చువేళల
నచ్చముగా గుణము చూతు రంచితచరితుల్
త్రచ్చెదరు కులమతంబులు
తెచ్చెదరున్ ఖలులు గ్రామదేశాంతరముల్

క. అర్హులకు నీమి లోక వి
గర్హణపాత్రులకు నీవి కతమున ధర్మా
భ్యర్హితుని విత్తమే నం
తర్హిత మగునందు రర్థతత్త్వాభిజ్ఞుల్

* * *

క. వనధిజలదంబుల ట్ల
య్యెను ధర్మార్థములు రెండు నితరేతరసం
జననమ్ము లీ రహస్యము
గని వానికి బుధుఁడు తుల్యగౌరవ మిచ్చున్

మహాక్కర

నెఱయఁబాడికినెడమై తనర్చు వానికినబ్బునభ్యుదయముసారిదిఁ
దఱుగు నట్టిదకాని పెంపొందునె తగవరిసంపత్తి చందమ్మునన్
బెరిఁగెనె పులిచూల్వాలునకెన్నేని బిడ్డలంగన్నఁ దదన్వయంబు
సురభి తా నొక్క పాపన పడసిన సుబ్బదెతజ్జాతి పూజ్యమాచున్

గీ. ఉత్తమజ్ఞానవృద్ధుల నృత్త మరసి
సుజనసంసర్గమునకు నౌత్సుక్యమూఁది
తగ వెఱింగి యెఱింగినదాని విడక
నడపనేర్చినతండ యున్నతి గడించు

గీ. కాయ మంభస్తరంగసంకాశ మగుట
ధనము శంపాలతాసగోత్రంబ యగుట
మతి మతంగజకర్ణసమ్మితమ యగుటఁ
గాదు జాడ్యంబు ధర్మసంగ్రహమునెడల

గీ. అడుగువెట్టదు కల్మి గేహమ్ము నెడసి
మసనమునయందె చుట్టాలు మరలిపోదు
రాత్మకృతపుణ్యపాపంబు లవియ పురుషు
వెంబడించు నొడల్వాసి వెడలువేళ

క. మదిమఱపులేక లోభము
మదమ్ము పెరరేఁప నరుఁడు మరగిన పాపం
బది డిందఁగఁ బాచిత ము
న్నదా నరకవహ్నియం దఱంగుట దక్కన్

క. గఱువలచే మేల్గీడులు
పరసహస్రముగ నుసుపఁబడెఁగాని మహిఁ
బరహితమునట్టిసుకృతము
పరాపకృతి కీడు వచ్చు పాపము గలదే

గీ. ధర్మవును శమనుండు భూతమ్ము లైదు
నంతరాత్మయు నమృతాంశుఁ డర్యముండు
శ్రుతులు సంధ్యలు రే పవల్ సూచు నరుని
పోకడల నన్నపల్కు మఱాకుమన్న !

* * *

క. గోర్చుట్టుమీఁద రోఁకటి
నార్చినగతిఁ బేదనెత్తి నదనపువడ్డిం
బేర్చెడు వార్ధుషికత మొద
లార్చున్ సకలార్థరాశి నగ్నియపోలెన్

క. ఒకపుట్టుఁగుంక తన తా
లికి వచ్చిన రెండుమూకలే డబ్బది వే
లకుఁ బెంచెఁ; బెంచినది హా
టకమా ? వివరింపు మత్కటంబగు నఘమా ?

ఆ. యుగయుగాల నుండియును ధనవంతు లీ
రీతి నీతి పాపభీతి లేక
పీల్చుచున్నవారు పేదలరక్తంబు
తీయతీయకొండ తేనెవోలె

గీ. చెమటలోఁ జీకి చీకి కష్టించు బడుగు
కమికెఁ డన్నంబులేక యేఁకారు టేమి ?
మెండకన్నెఱుఁగని శుంఠ లింద్రభోగ
మగ్నులై కోరమీసాలు మలపు టేమి ?

గీ. ఆఁకటికి గ్రమ్మి చలిదెబ్బ కలమటించి
మొండిరోగాల కవమానములకు లోఁగి
నాగరక లోకమున కొక్క నవ్వు విసరి
పిలుచుచున్నాఁడు యము నహో ! పేదవాఁడు.

గీ. ఎవనివెముక లీ మేడల కిటుకలయ్యె
నెవనిర క్తంబుచే గోడ లిట్లు బిగిసె
నతనికా యిట్టి పరమహేయంపుబ్రదుకు
వానికా యిట్టి దుర్మరణానుభూతి

గీ. కాలదంష్ట్రికవోని ఖడ్గమ్ము చూపి
చెఱకడమ్మనుబోని దబ్బరలు మప్పి
చేదుతలపోఁత లెఱుఁగని పేదవారి
పొట్టలం గొట్టి రాత్మైకభోగరతులు

ఆ. బొజ్జబలిసి నేఁడు విఱ్ఱవీఁగుచునున్న
సాహుకార్ల యాట సాగ దిల్లె
రుద్రమూ ర్తియై దరిద్రుండు చిచ్చఱ
కన్ను విప్పి గర్జఁ గట్టు నెపుడొ

క. ఈ చెఱువు లీ నదీచయ
మీ చతురబ్ధులు తదగ్ని హేరాళ జ్వా
లా చక్ర విక్రమ క్రీ
డాచాతురి మాన్పఁజాలుట యసాధ్యమయా!

ఈ సంవర్త్తశిఖిచ్ఛటల్ తమకుఁ దామే శాంతికిం జొచ్చి జ్యో
త్స్నా సోదర్యతఁ గైకొను న్గవలయా ప్రఖ్యాతికిం దావులై
యీసర్వంసహ తద్రసార్ద్రిమగునాఁ డేమూల వీక్షించినన్
రాసుల్ రాసులు పండి బండిబరువై యంపిల్లు నుల్లాసముల్

ఈకపటోక్తు లిచ్ఛకము లీ నటనల్ మొగమోట లీ యసూ
యాకలుషీకృతాశయము లందని కోరుకు లీర్ష్య లీ భయో
ద్రేకము లీ పగల్ వగ లదృశ్యములై యపు డచ్ఛబాంధవ
శ్లోకము లూగు సత్యశివసుందరజీవితముల్ మొదల్కొనన్

క. ఇతరులకీర్తికి ధిషణా
చతురతకున్ రూపవిత్తసంపన్నతకున్
వెతపడు నీర్ష్యారోగిన్
బ్రతికించెడు వెజ్జు త్రిభువనమ్ములఁ గలఁడే

క. తనకంటె లెస్సవాఁ డుం
ట నెఱింగి యహంత మానుట కడు న్వలయున్
దనకంటె నధము లుండం
గని * యున్నది నరుఁడు కుందక వణిక్ప్రవరా!

---

* ఉండునది (విధ్యర్థకము)

ఆ. చెమట నోడ్చి నరుఁడు జీవింపఁదగుఁగాని
తేరసొమ్ము మెక్కి త్రేఁపరాదు
బానిసీఁడు కుడుచు పరమాన్నమునకంటె
నుచిత మిచ్చకొలఁది నొదవుగంజి

క. మన యౌన్నత్యముఁ జాటఁగ
మన ఔన్నత్యంబ కడు సమర్థంబు సుమీ
ధనధాన్యకరిపురోగమ
ఘనసంపజ్జాత మూఁతగా దిప్పట్లన్

గీ. వాఙ్మనఃకాయముల నెట్టివారి కేని
హింససేయమి పరమార్థహేతు వన్య
కాంత జవ్వన మాసింపఁగాదు పురుష
కార మెడమైన దైవ మక్కఱకు రాదు

క. వెలిమార్తుర నోర్చెడి వా
రల కే మంతర్విరోధి రాజి నడంపన్
గలవార జగామగ ల
గ్గెలుపే యపవర్గసిద్ధికి న్మూలమగున్

సీ. ఉభయతోముఖ గవాయుత దానఫలదాత్రి
సత్యోక్తియను నీతిసరణి విడకు
రాగవైరముల ధర్మము నుజ్జగింపకు
మపకారికైన లగ్గాచరింపు

శుభపరంపరలను జూచి అంపిల్లకు
బెడఁద లంటినవేళ బెండునడకు
పరనింద సేయఁ బొల్పడకు మాత్మగుణాను
కీర్తన మ్మది లఘుక్రియగ నెంచు

గీ. *మచ్చరుల కింపు సంధిల్లునట్లు పలుకు
మడుగకయమున్న యిచ్చుభాగ్యంబు గనుము
కృత మెఱుంగుము ధర్మము న్గతిలపెట్టు
ధర్మువును మెచ్చఁబోకు వర్తకవతంస

* * *

క. మది నిల్పుము నారాయణ
పదవాచ్యుండై వెలుంగు పరమేశ్వరుపై
సదమలభక్తియ భగవ
త్పదమ్ము నందించు మేలిబాట కిరాటా!

క. ఆపద లవి ముజ్జిడ్డుగఁ
బ్రాపించినవేళ విశ్వపతిఁ బిల్చి సుఖం
బాపాదిల్లిన మఱచుట
కాపురుషునిలక్షణంబుగాఁ జెప్పెదగుర్

క. భగవత్కృపావిదూరులు
జగమ్మునం దేమిసేయఁ జాలుదురయ్యా!
జగదీశుదయకు నోఁచిన
నగమ్ము నుల్లూఁతలూఁపదా యణువేర్రి

---

* ఇతరులకు (దేశ్యము)

క. ఆస్తికత వలయు నిస్తుల
శస్త్రవిఖ్యాతివలచు జనునకు గర్వ
గ్రస్తుం డస్తవివేకుఁడు
నాస్తిక్యము నిచ్చమెచ్చు నరకము సొచ్చున్

క. కోవెలలో గంగానది
రేవులలో రామకోటిరేఖలలో లేఁ
డే వానిబుద్ధి కరుణకు
నావాలం బతనియంద హరి వసియించున్

వ. అని యక్కిరాటునకుఁ బెక్కుచక్కట్లు నుప్పి యప్పుణ్య
పురుషుండు తనపల్లెకుం జేరె నంత నితని లోకోత్తరధర్మాభి
రతియ తనపాలింటి వేల్పుటావై పౌరుష మ్మెల్లఁ బండింప
నితండు గ్రాసవాసోదైన్యమ్ములనడచి పరిణీతుండై భోగ
త్యాగమ్ములకు వలయుకలిమిం బడసి సుఖియించె నీ వైశ్య
మిత్ర మెవ్వం డొకో యందు రే నమ్మహామహునిచరిత్రంబు
దత్తావధానులరై యవధరింపుఁడు ౧౧౧

౪

గీ. కత్తిచేఁ దెల్గుపొలిమేర లొత్తి యొత్తి
కల్గుచే మన్ను బంగారువల్గుఁ జేసి
మేలినడవళ్ళచే వీనుమిగిలినట్టి
కమ్మనంశంబు మీ రెఱుంగనిదిగాదు ౧౧౨

సీ. ఏవంశమునఁ బుట్టె నిద్ధాంధ్రసామ్రాజ్య
ధౌరేయబాహుప్రతాపరుద్రుఁ
డేవంశమునఁ బుట్టెఁ గృష్ణరాయక్షమా
భృచ్చమూనేతృరావెళ్ళమల్లఁ
డేవంశమునఁబుట్టె హేరాళదాతృతా
వీరతాభ్రాజిష్ణువేంకటాద్రి
యేవంశమునఁ బుట్టె సేవాసమంచితా
రంభశుంభ * త్సూర్య...రాఘవుండు

గీ. ప్రకృతిపరమరహస్యశోభావిభూతి
వేతృశతశిల్పి నరసింహవీరుఁ డుద్భ
వించె నే వంశమున దాని వింద్రు మీరు
క్రొత్తకొనియాట యేల తత్కులముపెంపు

---

* సూర్యదేవర – రాఘవయ్యచౌదరిగారు.

క. ఆ కమ్మవంశమునయం
దాకాశధునీసుధాకరానంతనిభ
శ్లోకుఁడు రిపుభీకరధా
టీకుఁడు మును పుట్టెఁ బేచ టీకన్న యనన్

ఆ. పెమ్మసానికులుఁడు తిమ్మభూజానికి
గండికోట నేలుదండిమగని
కాప్తుఁడై యమాత్యుఁడై దళవాయియై
వన్నెకెక్కె ద్విపదవార్యుఁ డతఁడు

క. తజ్జన్మఫలం బనఁగా
సజ్జనసంభావ్యశీలసంపన్నధియా
నొజ్జయ్య వొడమె నతనికి
విజ్ఞాను దత్కీర్తి సురగవీసమ్మితమై

గీ. అతనికిం గల్గె నయ్యవారప్ప యనెడి
నందనుండు; దయాధర్మకంద మగుట
నయ్యవారయ్యె నెల్లర కమ్మహాత్ముఁ
డొజ్జకొడు కయ్యవా రౌట యుచితమకద

క. జనియించె నతని కన్నయ
కనదాచారుం డతండు గనె ముత్తయ్యన్
వినయాశ్రియుఁ డతనికి నా
త్తనయుఁడు రమణాభిధుండు తనయుం డయ్యెన్

క. ఆ రమణయచౌదరి సా
ధ్వీరత్నము కిచ్చమాంబఁ బెండ్లాడి గుణా
ధారుని శూరుని బుధమం
దారుని శేషయ్యఁ గనె ముదం బెసలారన్

క. అతిమాత్రపూతచరితాం
చితయగు సుబ్బమ్మవలన శేషార్యునకున్
సుతు లుదయించిరి వేంకట
పతి సీతారామనామభాస్వగు లగుచున్

క. అందగ్రజుండు శారద
కందపురందరకరీందుకరసురతటినీ
మందారహీరలవలీ
కుందసమానస్పందకీర్తిఁ గొని రాణించెన్

క. భాసురగుణసంపద ల
క్ష్మీసతికిన్ మిన్న యగుచు మించు మహాల
క్ష్మీసతి కయ్యనఘుండు పతి
యై సల్పె గృహస్థధర్మ మార్యులు మెచ్చన్

గీ. ధన్యజీవనులైన తద్దంపతులకుఁ
బ్రాగ్భవార్జిత సుకృతమ్ము పంటయనఁగఁ
బుట్టి రిద్దఱు కొమరు; లప్పుత్రులందుఁ
బెద్దయై బాపయాఖ్యుండు తద్ద వెలసె

క. తదనుజుఁడై కమ్మకులాం
బుధిశీతమయూఖుఁడై ప్రభూతమనీషా
స్పదుఁడై నైతికపదవీ
నదవీయసియైనబుద్ధి నారయ నెగడెన్

సీ. నిత్యసత్యాలాపనియతిపై ననురక్తి
సెందినాఁడు జయంబు నందినాఁడు
పరవిత్త మది విషప్రాయంబ యని విశ్వ
సించినాఁడు తిరస్కరించినాఁడు
దీనార్తిలోకంబుఁ దిలకించి కన్నీరు
జార్చినాఁ డండకుం జేర్చినాఁడు
మొగమోట దిగఁద్రావి తగవుసెప్పెడి నేర్పు
నేర్చినాఁడు యశానఁ బేర్చినాఁడు
కష్టమున్ సుఖమున్ దుల్యదృష్టితోడఁ
జూచినాఁ డొక్కత్రాసులోఁ దూఁచినాఁడు
నాఁడునేఁడును బుధులు కొండాడుసడత
నివ్వటిల్లిన నారయ్య కెవ్వ రీడు

క. గోవింద చరణసేవా
హేవాకనిరస్త *దానవేశ్వరసుతుఁడై
జీవన్ముక్తుండై సుజ
నావళి కతఁ డొజ్జబంతియై పావణిల్లెన్

* ప్రహ్లాదుఁడు.

క. అతిలోకత్యాగసమం
చిత మేతత్కార్య మతఁడచేసె; నహో! మత్
కృతపుణ్యపాటవమ్మున
నతఁడే ననుఁ గన్నతండ్రి యయ్యె వినుండా!

చదువకయున్న నేమి బుధసత్తము లబ్బుఁగ నర్థభావసం
పద వికసింప భాగవతభారతముల్ వివరించు; హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువు నతండు; తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్

క. మక్కువమైఁ గొండికనాఁ
డక్కఱ గలయప్డు లేని యప్పుడు నొంటపా
చక్కట్లదండ లాతఁడు
పెక్కులు మన్మృదులహృదయపీఠికిఁ జుట్టెన్

క. నమ్మినవారిం జెఱుపమి
దమ్మిడియే నొరులసొత్తు దాఁకమి జగదీ
డ్యమ్ము సుమా యని యాకన
కమ్ము కథన్ నాకుఁ దారకాణ యొనర్చెన్ ౧౩౦

ఆ. మచ్చలేని యిట్టి మనుగడతోఁ జతు
ష్షష్టివత్సరములు జగతి నిల్చి
యరిగెఁ బింగళాబ్దమం దితఁ డానంద
భవనమునకు విష్ణుభువనమునకు ౧౩౧

చ. పదపడి తాడెపల్లికులపావనుఁ బుంవపురీడ్యమాన శా
రద నల వేంకటప్పగురు "రామకథాఽమృత" కావ్యకర్త న
న్మదనుపమానపుణ్యమహిమమ్మునఁగొల్చి రసాశ్రయమ్ములన్
జదివితిఁ గాళిదాసకవిసత్తముకబ్బము లమ్మనీషితోన్

క. గురుకాణయాచి ధనదుని
పురమునకున్ దినదినమ్ము పోయెడి నాకున్
మఱపునకు రానికథయై
స్థిరపడె నిప్పసిఁడిగాథ చిత్తమునందున్

క. ఆ కోమటి యింటికిఁ జని
యాకనకోదంతె మడుగ నిచ్చవడియు నే
మో కస్సు బుస్సు మం చను
నో కథ యడ్డంబు తిరుగునో యనుభీతిన్

గీ. కాల మెంతేని గడపితిఁ గాని మదికి
దూరమై పోవదయ్యె నయ్యారటంబు
ఎట్టకేలకు సాహస మ్మింత సూపి
*యనుగుపెట్టితి సెట్టిగేహమ్ము నందు

తొంబదియేండ్లు దాటి జరతో రుజతోఁ జెరలాటమాడు వ
గ్గుం బొడగంటి నొక్కరుని గొంకుమెయి న్గడిగిళ్ళు వెట్టి భ
వ్యం బెయటంటి "జిత్త మెవరయ్యలుమీ" రనుచుం బ్రసన్న భా
వంబున లేచె వర్తకుఁడు వాడినకన్నులు తెల్వి నందఁగన్

వ. అంత నేను

గీ. మాది కావూరు; కొండొక మాట లాడ
వలచి మీ సన్నిధింగూర్చి వచ్చినాఁడ
మీరు తుమ్మల నారయ్యగారి నెఱిఁగి
యుందురా వారి కేఁ దనయుండ నగుదు

వ. అనుటయు నతండు సంభ్రమాశ్చర్యహర్షోత్కర్షంబులం దొప్పదోఁగువాఁడు న న్నెగదిగం జూచి

క. నారయ్య బిడ్డవా! బా
బూ! రమ్మిటు రమ్ము దైవయోగముకతనన్
నీరాక దొరలె; నురలెన్
గారాకులవోలె నాదు కలుషము లెల్లన్

* ఈ పని ౧౨-౧౨-౩౭ జరిగినది.

క. ఊరున్ నాఁడును మెచ్చెడి
నారయ్యా నైదలియకుందునా వినవో నా
కోరంత పొద్దు నాతని
పేరే తారకము వేలుపే యతఁడు సుమా

క. ఆదరునై మ మ్మేలిన-
మా దీపము నిల్పినట్టి మాన్యుం డతఁడే
కాదంటి మేని ధర్మము
లే దిహమున్ లేదు పరము లేదును మాకున్

ఉ. కారణజన్ముఁ డాతఁడు జగమ్మునవా రొకపుచ్చువక్కకై
పారము లేని పాపములపాల్పడుచుండఁగ నైదుకట్ల బం
గారము నస్మదీయమును గాచి శరత్తులు దాఁచి రాకయుం
గోరక యిచ్చె లేమి కనుఁగుంగొడుకై వసివాడుచుండియున్

క. ఏలావ్రతములు తీర్థము
లేలా జన్నములు చదువు లేలా యోగం
బేలా తపస్సు నరునికి
శీలం బది యింత చెక్కుచెదరక యున్నన్

గీ. అంత కొకయింటివాఁడు కాఁడయ్యె నీడు
ముదిరియున్నను లేనికాఁపురముగాన;
నెట్టి యొలగడ్డముల నున్న నేమతండు
తొనఁక నొల్లఁడు ధర్మచ్యుతుండుగాఁడు

ఆ. ఇట్టి పుణ్యమూర్తు లిట్టి మహామహులు
లేకదా జగమ్ము వ్రేక నోర్తు;
శేల మాతృయావనై లాలతాలవి
తరిములమాట నీచతములబాట

వ. అనవుడు న్నేను.

గీ. ఆడఁబోఁ దీర్థమే యెదురైన యట్లు
లడుగవచ్చినకథ సెప్పితయ్య నీవ
మేలుమేల్ మెచ్చినాఁడ నీ శీలమునకు
మేలు మఱవని నీకు జేజేలు సెట్టి!

వ. అనుటయు

క. ఇదియు నొక గొప్పసేతయె
సదమలగుణరాశి నీదు జనకునిశీలం
బది యెక్కఁడ నిదియెక్కఁడఁ
జదురున్నఁగ దానినెల్ల సభలన్ జెపుమా

క. ఈ పూఁటకు మాయింటను
సాపాటొనరింపు మిది ప్రసాదము మాకున్
నీ పొట్టనింపి తనిపిన
మా పుట్టువు ధన్యతాసమగ్రము గాదే!

క. మీ తండ్రి ఋణము దీర్పని
పాతకులగు మమ్ము సత్కృపామతిమై న
పూతాత్మునిసుతుఁ డగు నీ
వో తండ్రీ! యుద్ధరించు టుచితమ్ముకదా?

క. అని వినయోక్తిపరంపర
దనరన్ వణిగగ్రిముఁడు కృతజ్ఞతఁ జూపెన్
దనయాలికిఁ దన యాలికి
నను బరిచితుఁ జేసె మన్ననల్ దయివారన్

వ. అయ్యవసరంబున

మంజరి. చిఱుబంతి పసుపాడి సీమంతవీధి
గుఱిచేసి పెద్దకుంకుమబొట్టు నలఁది
ముత్యాల తాటంకముల నొప్పఁ దాల్చి
ప్రభలు చిమ్మెడు నడ్డబాస ధరించి
పాట పాటగ వెల్లఁబాఱిన కురుల
విరులతో జతగూర్చి వేనలిఁ దీర్చి
ముద్దైన సరిగకమ్ములఁ బిసాళించు
చెంద్రికపూవన్నెచీరను గట్టి
కరువునంబోసిన గఱువతనంబొ
కరుడుగట్టిన యట్టి కారుణ్యరసమొ
మేనుదాల్చిన జగామేలిశీలంబొ ;

తొలుమిన్కునాఁటి మైదువరో యనంగ
నెదుట నిల్చినసెట్టియిల్లాలు నన్నుఁ
దెలిగన్నుఁగవతోడఁ దిలకించి సుంత
జిలుఁగువెన్నెల లూరు చిఱునవ్వు సూపి
యమృతధారాస్యంది యగుపల్కుతోడ
నారయ్య కడుపుపంటవె నీవు తండ్రి!
లేరయ్య! మిమ్ముఁ బోలిన పుణ్యధనులు
లోకాన మీకథల్ నుడివినచోట
దొరకునే తా వెట్టిదురితానకేని
నెల్లకాలంబు మీయిల్లు ధర్మమున
కాశ్రయంబై కీర్తి నార్జించుఁ గాక!
యష్టభోగంబు లిష్టైశ్వర్యములును
దిరములై మీకు సిద్ధించునుగాక!
బ్రహ్మాయురున్నతిఁ బడసి మీ వంశ
మా చంద్రభాస్కరం బలరొందుఁగాక!
యని మెచ్చి వెలలేనియాశీస్సు లిచ్చి
యరగంటలో వంట యగును మజ్జనము
సలుపలెమ్మని బానసమ్మున కేగె

వ. అంత

సీ. హైయంగవీనదివ్యామోదబంధువై
జీరకవాసనాశ్రీఁ బెనంగి
మెంతికమ్మఁదనంబు నెంతేనిఁ జేపట్టి
యింగువనెత్తావిపొంగు లాలసి
కఱివేపవలపుతోఁ గలసి కుస్తుంబరీ
లలితపల్లవపరీమళము నెనసి
మాషఖండఘుమంఘుమను గూడి సర్షప
గంధమ్ముతోడి సాంగత్యమంది
వంటయిలు వీడి వాడలవెంటఁ జాగి
పౌరనాసాభితర్పణకారి యగుచుఁ
జవులు పుట్టించు తాలింపుసౌరభమ్ము
హెచ్చి మజ్జాఠరజ్వాల రెచ్చఁగొట్టె

సీ. వలచు కప్పురభోగి వరివంటకమ్ముతోఁ
గారవేల్లాది శాకములతోడఁ
బసుపునిగ్గులకందిపప్పుతోఁ బులుసుతోఁ
బచ్చళ్ళతో షాడబంబుతోడ
వడియాలతోడ నప్పడములతో వరుగుతో
లడ్డువమ్ముల చక్కిలములతోడఁ
బోళీలతో గారెబూరెలతో నంటి
ఫలములతోఁ దేనెతోలలతోడ

మీఁగడలతోడఁ బెరుగుతో మేలితరపు
టావకాయతో గంధతోయమ్ముతోడ
విందొసఁగె నమ్మహాసాధ్వి వేడ్కఁ దనకుఁ
బసిఁడిగాజులు పోఁచీలఁ గొసరితాఁక ౧౫౮

# ౬

గీ. భోజనోత్తరమందుఁ గప్పురపువిడెము
నమలి భుక్తిశ్రమం బింత సమసినంత
జరఠవైశ్యుని జూచి తజ్జాతరూప
మవల నేమయ్యె నెఱిఁగింపు మనుడు నతఁడు ౧౫౯

క. సజ్జనమూర్ధన్యుఁడు యు
ష్మజ్జనయిత కూర్మినిచ్చు జాంబూనదముల్
మజ్జనకుఁ డింట నిల్పక
విజ్జన సాధ్వసముతోడ విహ్వాలుఁ డగుచున్

క. కోడూరం గల తన చెలి
కాఁ డగు సంసారి కిచ్చెఁ గావు మటంచున్
వాఁ డాకడానిఁ జూచిన
తోడన కనుగుట్టి పెంచె దుర్ద్రోహదముల్

వ. మా తండ్రి కొన్నినాళ్ళ కతనిం జేరి సొమ్మున్నిమ్మన

ఆ. ఎంత నింద వచ్చె నేనాఁటి పాపమో
పాటిదిబ్బలోన మాటినట్టి
పసిఁడి నే ఖలుండో పసివట్టి మ్రింగె న
య్యో! యటంచు నాతఁ డుమ్మలించె

గీ. నిలువునం గూలి నా తండ్రి తెలివి దప్పి
తేఱుకొని మిత్రుఁ జూచి కన్నీరు జార్చి
యెంతపనిఁ జేసితయ్య! నీ వింతవాఁడ
వని యెఱుంగక వెంగలి నైతి నేను

క. పోయినదా నా బంగరు
పోయినదా నన్ను మఱచి పోయినదా నా
కీ యొడలింకేటి కిసీ!
నీ యెదుటన చత్తు నొక్క నిమిషములోనన్

క. అని వాని యింటిదూలం
బున కురి సంధించి వ్రేలఁబోవఁగ మిత్రుం
డనుమానంపడి కొంపలు
మునుఁగు నటం చదరి బెదరి మూరినభీతిన్

ఆ. జనకు నిల్వరించి సైఁపుము నాదోష
మెఱుక లేమి గడ్డిఁ గఱచినాఁడ
మఱచినాఁడ నీతిమార్గంబు నీ మదిన్
విఱిచినాఁడ మైత్రి చెఱిచినాఁడ

ఆ. కన్నుమూఁత లేక యిన్నాళ్ళు నీసొమ్ము
గాచినాఁడ నింట దాఁచినాఁడఁ
గాఁపుఁగూలి తృణమొ కణమో యొసంగి నీ
యచ్చులందు మిందమని వచించె

వ. అనుటయు మజ్జనకుండు

క. మొదటికి మోసము లేదిఁక
బ్రదికితిరా దేవుఁడా! కృపానిధి! యంచున్
మది నుబ్బుచు రూప్యంబులు
పదియేఁబదు లతని కిచ్చి పసిఁడిన్ దెచ్చెన్

పదపడి ధూళిపూఁడి యనుపల్లియ నల్లునియింటఁ దాచి తా
నెదపయిఁ జేయి సేర్చి యొకయేఁడు సుఖమ్ముగనిద్రవోయె న
ప్పిదప సువర్ణమిమ్మనుచు వేఁడఁగ నల్లుఁడు నీతిబాహ్యుఁడై
యదియిది సెప్పుచున్ నెలలునబ్దములీడ్చె నుపాయమేర్పడన్

క. నారయవో నిపవిత్రు లు
దారులు పెక్కండ్రు జగతి నబ్బంగలరా
దూరీకృతసత్యులు దురి
తారంభులు దుగ్ధముఖవిషాబ్ధులు దక్కన్

ఆ దశమగ్రహంబు మనుజాపశదుండు సమస్తబంధులున్
నీదుచరిత్ర మెంతయును నింద్యమిసీ! యని ప్రువ్వఁదిట్ట మా
సోదరి తన్ను వేడుకొనుచున్ బెదరించుచు నుగ్రి కెల్బిపా
పాదక మిట్టిసేఁత నలుపందగునా యని బుద్ధిసెప్పఁగన్

ఆ. తనదురాశ కొక్కదానిని బలిచేసి
కడమ రెండుముక్క లిడియె మాకు;
మార్చుకొంటి మంత మదరిపురంబులో
రొక్కమునకు జాతరూప మెల్ల

గీ. పసిఁడి పండ్రెండు వేలరూప్యముల కమ్మ
మునురుకొని యున్న పెద్దమ్మపస నడంచి
పాఁడిపంటలు వాణిజ్యపాటవమ్ము
దనర నున్నార మిట్లు నీతండ్రిచలువ

వ. అనిపల్క వెండియు నే నతనిం గాంచి తాతా ! పసిఁడి యచ్చది యెట్లుండు? దాని యాకృతి మున్నగు చిహ్నంబుల నెఱుపుమా యని వేఁడఁ దా మేటివీఁపువోలెఁ దాటి బెల్లపుటచ్చుంబలె నక్కనకఖండంబు వెలయు దానిపై ఖవర్ణ పూర్వకమ్ముగాఁ బదివేల యొక్కటికిం జెందిన తెలుఁగింకె (ఖ ౧౦౦౦౧) లుండు నీ యంకమ్ములకు నాయపరంజి గ్రేఁగునకుం గల పొత్తెయ్యదియో బుద్ధికందదాయె నిట్టి యచ్చులు నితరధనంబులుం బెట్టి పుట్టినవారి కివ్వీటనేఁటికిం జేపడుచున్న విది రత్నగర్భ గదా యని యమ్ముదుకండు నివేదించుటయు నే నిష్టకథా వినోదంబుల మఱికొంత సేపు గడపి యయ్యా ! * యే నెఱ్ఱులం దోలుచున్నయది యేను బయనంబు సాగింప వలయుఁ గృతజ్ఞతారాశివైన - నన్నింతగా నాదరించిన - యపూర్వగాథ లనేకంబు లెఱుకువచేసిన నీకు సాధుసత్తమునకు నా నమోవాకమ్ము లీనెయ్యంబు మన తరతరమ్ముల నవిచ్ఛిన్నమై కొనలుసాగుంగావుత వెడలివచ్చెద

* సూర్యబింబము (దేశ్యము)

నిలువుం డని ప్రసన్నతామృదమాకృతదర్శనుం డగు నతని
నలనం బాసి యింటికిం జనువాఁడనై మఱపునకు రాని
యీ యిల్లడవృత్తాంతమున్గుఱిచి

క. వృత్తం బుదారధర్మా
యత్తము నాయంకుఁడన్న నస్మజ్జనకుం
డత్తిన కవితాకళ నీ
చిత్తరువు న్దిద్ది బయలుసేయన్దగదే

క. నీఁగెదఁ బత్యాణభారం
బీఁగెదఁ జరితార్థకోటి నిహపరసౌఖ్య
శ్రీగరిమం బిడు కృతికిం
జాగెద నాంధ్రీసపర్య సలిపెద నింగన్

వ. అని తలంచి శ్రద్ధధానుండనై ప్రమాదిశరదాశిశిరమ్మున

క. వ్రాసిన యీచిఱుకబ్బము
వాసి స్గడియించుఁగాత వసుమతి మాకున్
మా సంతతికిని ధర్మ
వ్యాసక్తియ సిరులకంటె నగ్గియ మగుతన్ ౧౨౦

## మా కృతులు.

| | | |
|---|---|---|
| ౧ | ఆత్మార్పణము | ౦-౬-౦ |
| ౨ | ఆత్మకథ | ౧-౦-౦ |
| ౩ | రాష్ట్రగానము | ౦-౩-౦ |
| ౪ | ధర్మజ్యోతి | ౦-౮-౦ |
| ౫ | పఱిగపంట (అచ్చులో) (చాటువులు) | |


తుమ్మల సీతారామమూర్తి చౌదరి
బోర్డుహైస్కూల్ పండిట్
పొన్నూరు P. O.
(గుంటూరుజిల్లా)